# ఆంధ్ర విజయశ్రీ

★ 

కృతిభర్త
గౌరవనీయులగు

శ్రీ గ్రంధి వేంకటరెడ్డినాయుడుగారు
బి. ఎ., బి. ఎల్.
న్యాయశాఖామాత్యులు, ఆంధ్రప్రదేశ్.

★

కృతికర్త
శ్రీ వడ్డాది సీతారామాంజనేయ కవి.

★

'కమలకుటీర్'
ప్రచురణము.



కృతి భర్త

గౌ॥ శ్రీ గర్రంధి వేంకటరెడ్డినాయుడు గారు

బి. ఏ., బి. యల్.,



కృతికర్త

శ్రీ వడ్డాది సీతారామాంజనేయ కవి.

శ్రీ ర స్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# ఆంధ్ర విజయ శ్రీ.

"వందేమాతర మద్రిరాజమకుటాం
ప్రాక్పశ్చిమాద్ర్యంగదాం
ఛందశ్శాస్త్రపురాణ లౌకికకలా
సంభూషితాస్యాంబుజామ్,
బందీభూత నిజాత్మజా మదితి భూ
వంద్యాళి భూషాదుకాం
హిందూభూమ్యభిధాం పరావనపరాం
హింసాదిదోషోజ్ఝితామ్." 1.

"వందేమాతర మీడ్యమాన కమలా
వాణీ సమానాశ్రియాం
సందావాజ్ఞ కృతజ్ఞ దక్షిణ తనూ
జాతాం పురాణస్తుతామ్,
కుందేందూపమకీర్తి సంవళిత ది
క్కూలాం దయాశాలి నిస్
స్పందాంతఃకరణాం సదాంధ్రవసుధా
సంజ్ఞా మహింసావ్రతామ్." 2.

మ॥ తెనుఁగున్ ధాత్రికి రత్నహారమగుచున్
దీపించు కృష్ణాతటిన్,
గనకాద్రిన్, బెజవాడపట్టణమునన్
గళ్యాణధామంబునన్,
మణిసింహాసనమందుఁ గొల్వమరి బ్ర
హ్మాండంబులన్ సత్కృపన్
గని, పాలించు మహేశ్వరి, భక్తనిధి, దు
ర్గామాత మమ్మోముతన్ !

శ్రీమంతుం డగు లోకమాన్యతిలక
శ్రీబాలగంగాధరుం
డామోదింపఁగఁ జేయ నీయకొనె భా
షాన్వితరాష్ట్రప్రతి
ష్ఠామంత్రాంగ మెఱింగి కాంగ్రెసు; తది
ష్టమ్మిప్పు డాంధ్రప్రదేశ్
నామోపస్థితి దర్శనమ్మిడె మహా
నందమ్ము పెంపొందఁగన్.

చ॥ ప్రజలు పరోపకారమొన
రన్ జరిపించు ప్రజాప్రభుత్వ మాం
ధ్రజగతి కిచ్చి రాజ్యసభ
ధర్మము చక్కఁగ నిర్వహించుటన్
విజయమహోత్సుకత్వ మతి

వేలముగాఁగఁ దరంగితం బగుచున్
నిజహృదయాంతరంగమున
నిత్యనిరూఢత నాంధ్రజాతికిన్. 5.

సీ॥ సాఫల్యమొందె శశ్వద్భక్తినొనరించు
శ్రీరామ పదసరసీజపూజ;
సిద్ధించె నాంధ్రప్రసిద్ధి సంవర్ధింప
నన్నయ్యకైకొన్న నవ్యదీక్ష;
దర్శనంబాసఁగెఁ బ్రతాపరుద్రప్రతా
పామల భవపరమాశయమ్ము;
సాక్షాత్కరించె వేమనయోగిపుంగవ
దివ్యతపోవృత్తోదీర్ణ ఫలము;

గీ॥ ప్రవిమలాంధ్రప్రదేశ నేఁటి కవతరింప;
రాజసింహుఁ డల్లూరి శ్రీరామరాజు,
ప్రేమమూర్తి శ్రీపొట్టి శ్రీరామసెట్టి
పొంగి కురియుచున్నారదే పుష్పవృష్టి. 6.

క॥ ఆంధ్రోద్యమమ్ము నేఁటికి
నాంధ్రప్రజ కైకమత్య మమరించి శుభం
బాంధ్రప్రదేశ మూర్తిగ
నాంధ్ర వసుంధరకుఁ గూర్చె నలరఁగ జగముల్. 7.

మ॥ నిఖిలాతంకములన్ సదుద్యమములన్
నిర్జించి, ధన్యాత్ములై

సుఖసంతోషవివర్ధనోత్సుకతతో
శోభిల్లు చిత్తమ్ముతో
నఖిలాంధ్రప్రజ యేకమై మనఁగ నేఁ
డాంధ్రప్రదేశంబు, స
మ్ముఖులై ప్రాంతజనమ్ము లెల్ల సఖులై
మోదింప, దీపించెడున్. 8.

గీ॥ కాశినాథునివంశ నాగేశునాత్మ
కమల మాంధ్రప్రదేశోదయమున నహహ!
యమృతవృష్టి నింపు మనున్న దఖిలదిశల
విశ్వదాతయన్ విఖ్యాతి వెల్లివిరియ. 9.

గీ॥ కొఱఁత లాంధ్రప్రదేశమున్ దొరయకుండఁ,
గలవు లాంధ్రప్రజన్ క్షోభ పఱుపకుండ
సత్ప్రకాశ ప్రభావ ప్రశాంతు లొసఁగి
మనుప నీశు, దేశోద్ధారకుని నమింతు. 10.

గీ॥ ఆంధ్రశబ్ద మాకర్ణించి నంతమాత్ర
నుబ్బిపోవు శ్రీ వంగూరి సుబ్బరావు
ప్రతిభ నాంధ్రప్రదేశమ్ముపైఁ బ్రభాత
వేళ నింపు వాఙ్మయసుమశ్రీల నదిగొ! 11.

గీ॥ దీపిలుచునుండె నాంధ్రప్రదేశ; మాప్ర
కాశ మోహాహాహా! వినుతింపఁగా వశంబె?

యఖిలరాష్ట్రమ్ము లానంద మతిశయింప
నడిగా! జేకొట్టుc బూర్ణసౌహార్దదీప్తి. 12.

సీ॥ నై శాల్యమా? లక్షపై నొకపదివేల
చదరపుమైళ్ళుగా సాగియుండు;
జనసముదాయమా? కనcగ మూc కోటిపై
నిరువదిలక్షలై పరcగుచుండుc;
బ్రకృతిసౌందర్యమా వనవాహినీశైల
కేదారసంపదన్ గెరలుచుండు;
విద్యాప్రభావమా? విస్ఫురదక్షర
మాలిక నాదియై క్రాలుచుండు;

ఆ॥ వె॥ చెన్నపురమునుండి శ్రీకాకుళమునకు,
బ్రహ్మపురమునుండి భద్రగిరికి
వ్యాప్తినొందియున్న యాంధ్రప్రదేశ ము
న్నతిగడించి భాగ్యనగర మొందె. 13.

ఆ॥ వె॥ ఎటులో యాంధ్రరాజ్య మెనోకశతాబ్దమ్ము
లకట! బానిసతన మనుభవించి
యిటు స్వతంత్రతc గనె నిప్పుడు; చీcకటుల్
విచ్చెc, గాంత్రి పొద్దు వెలుcగు హెచ్చె. 14

క॥ భిన్నత్వమ్మును నేక
త్వోన్నతి నాంధ్రప్రదేశ మొందcగలిగె; వి

చ్ఛిన్నముగాకున్నె తమం
జ్జ్యోత్స్నజ్యోతుల వెలుంగు లెల్లెడ నిండెన్? 15

మ॥ సమరక్షోణి రథమ్ము నిల్పి పరమో
త్సాహప్తి విశ్రాంతి ర
క్ష్యములన్ బొందఁగఁజేసి, యంత నిజగ
మ్యస్థానముగా నిర్మికో
ధముగాఁజేరి చెలంగు నవ్విజయుఁ డాం
ధ్రక్షోణి మంత్రిప్రకా
శమహోదారుఁడుగాఁగ మించి నిజవాం
ఛాపూర్తి నేఁడొందఁడే! 16

సీ॥ ఆంధ్రత్వమహిమకు నవధు లెం దున్నవే?
వినుతించి మించదే వేదవాణి?
ఆంధ్రత్వవిభవమ్ము నాశ్రయించియె కదా
సార్వభౌములు ప్రకాశమును గనిరి?
ఆంధ్రత్వసారస్య మాకళించుటఁ గాదె
ప్రఖ్యాతి సత్కవిప్రతతి పొందె?
ఆంధ్రత్వపాటవం బవలంబమై కాదె
పేరు కెక్కిరి మహావీరు లెల్ల?

గీ॥ నట్టి యాంధ్రత్వమున నఖండాభ్యుదయముఁ
బొంది యాంధ్రప్రదేశప్రభుత్వ మెప్పుడుఁ

బ్రజకు సంజీవకరణిగాఁ బ్రజ్వరిల్లి
విశ్వనుతమార్గదర్శియై వెలయుఁగాక! 17

చ॥ అమరఁ ద్రిలింగదేశమున
కభ్యుదయోన్నతి నిర్భరప్రభా
వమునఁ ద్రివిక్రముండు నిరు
పద్రవలీల నొసంగుఁగాక హ
ర్షముఁగొని సామరస్యమున
సర్వజనీనముగా, నిరంతరా
యముగఁ బ్రజాప్రభుత్వము స
మగ్రగతిన్ గొనసాగులాగునన్. 18

ఉ॥ మానముఁ, బ్రాణమున్ నిలిపి,
మమ్ముఁ బ్రసన్నత నుద్ధరించుచున్
జ్ఞానమొసంగి, మోక్షమిడు
స్వామివి నీవని శ్రీవరాహ ల
క్ష్మీనరసింహదేవ! నినుఁ
జేరితి మిత్తఱి మామహాంధ్రరా
ష్ట్రాసయనోద్యమమ్మున న
యమ్మ, జయ మ్మొనగూర్చి ప్రోవవే. 19

సీ॥ దేవ! యక్షతృతీయనాఁడీవు విజయ
వర్షవైశాఖమున నాదు ప్రార్థనమ్ము

లీల నాలించి కోర్కె చెల్లించినాఁడ
విష్ణు డాంధ్రప్రదేశ్ మాకు నేర్పరించి. 20

శా॥ స్వాతంత్ర్యమ్మును భారతక్షితిని సం
స్థాపింప భీష్మించి ప్ర
ఖ్యాతస్వేచ్ఛను శాంతియుద్ధమున మే
మార్జించుకొన్నాము; సం
గాతం బొప్పఁగ నేఁడు పొందితిమి ప్ర
జ్ఞారూఢి 'నాంధ్రప్రదేశ్';
మాతృశ్రీపదసేవచేసి సుఖముల్
ప్రాపింతు మే మీపయిన్. 21

సీ॥ శ్రీరామచంద్రపాదారవిందముల పూ
జాప్రమోదం బాంధ్రజాతి కొదవె,
యతివరేణ్యుండు, విద్యారణ్యుఁ డిడిన ము
హూర్త సత్పటిమ మాంధ్రోర్వి నలమె,
నాంధ్రావళిన్ మోద మందించు తిక్కన
దీక్షాఫలం బాంధ్రదేశ మందె,
మంత్రిచంద్రుండు, తిమ్మరుసయ్య పరమాశ
యావేశ మాంధ్రప్రజాళి నొందె,

ఆ॥వె॥ నాంధ్రవీరసింహుఁ, డల్లూరి శ్రీరామ
రాజు తేజ మాంధ్రి తేజ మొనసెఁ,

బుణ్యరాశియైన పొట్టి శ్రీరాముల
త్యాగ మాంధ్రుల ప్రభుతగ నెసంగె. 22

గీ॥ కొండవేంకటప్పయ దేశభక్తుఁడును, విశ్వ
దాత నాగేశ్వరుఁడు ముఖ్యధన్యజీవు
లదిగో! యాంధ్రప్రదేశోదయమున నలరి
కురియుచున్నారు దీవన విరులవాన. 23

గీ॥ కత్తివాఁడి మించిన యాంధ్రకవికలమ్ము
చెలఁగి యాంధ్రప్రదేశమ్ము నలరఁజేసి
యచ్చముగఁ బ్రజాస్వామిక మన్నఖ్యాతి
స్థిరముగా నిల్పి చిరము వర్ధిల్లుఁ గాక! 24

గీ॥ మూఁడుకోట్లయిర్వదిలక్ష లాడు ప్రణవ,
మాఱుకోట్ల నల్వది లక్ష లభయకరము
లమరి యాంధ్రప్రదేశమా! యలరు నీకు
నిర్భరాఖండవిజయమ్ము నిశ్చయమ్ము! 25

మ॥ సమతాభావము, నుద్యమోత్సుకత, ని
స్స్వార్థత్వ, మైక్యమ్ము, శాం
తము, నిర్భీకతయుఁ, సధర్మరతియుఁ,
దాక్షిణ్యమున్ బూని ని
త్య మహింసావ్రతదీక్షఁ జూపుము మహో
దర్కమ్ము నాంధ్రప్రదే

శమ! వ్యక్తిత్వము వీడ కీ వఖిలరా
ష్ట్రమ్ముల్ ప్రశంసింపఁగన్. 26

ఆ॥ వె॥ నీపదాబ్జపీఠి నీబిడ్డ లెందఱో
ధనము, ప్రాణములను వినుతబుద్ధి
నర్పణమ్ముచేసి యర్చించ రాంధ్రప్ర
దేశమాత! నీ కిదే నమస్సు. 27

సీ॥ భారతస్వాతంత్ర్య భండనమ్మున పైని
కంఠుడై విజయమ్ముఁ గొన్నవాఁడ;
ప్రత్యేకరాష్ట్రసంభవమహోత్సవ మిప్పు
డుత్సాహమునఁ జూచుచున్నవాఁడ;
నానాఁటికిఁ మహోన్నతిమించ వ్యక్తిత్వ
ముజ్జగింపక నింపు నొందువాఁడ;
సోదరరాష్ట్రవాసుల ఘనన్నన లొంది
మిత్రభావమ్ముతో మెలఁగువాఁడ;
గీ॥ సత మహింసాది దివ్యపుష్పముల నిన్ను
భక్తి మీఱంగఁ బూజించి వఱలువాఁడ
నమ్మ! యాంధ్రప్రదేశమాతా! ప్రసన్న
సత్యమతసమేతా! నమస్కారమమ్మ! 28

శా. చాడీగొట్లకు, లంచగొండులకుఁ, గా
సాబంపతండాలకున్,

గీ. పుల్‌మూడగఁ జేయు కూళులకు నీ
క్రేవన్ వసింపంగ, మా
టాడన్ జో టిసుమంత లేదు, మఱి లే;
దాంధ్రప్రదేశంబ! యే
గోడున్ జెందని జాడఁ జూడవె మమ్మున్
గూర్మిన్ బ్రిజాకోటులన్. 29

శా॥ టూలాటోలితనమ్ము సాగ దిటు పై;
తావున్న దే నీదివా
ణాలం దోటుగతిన్ బ్రవర్తిలి దివాన్
ఖాయ్‌దా బనాయించి డా
బాలన్, గాదెల నింపుకొంచు మురళిం
పన్? దల్లి! నీసేవకై
ఠోలాఠోలగ నేఁడు నీయనుఁగు బం
టుల్ వచ్చుచున్నా రదే! 30

గీ. భాగ్యనగరమ్ము హైదరాబాదు రాజ
ధానిగా నీవు సర్వస్వతంత్ర వగుచుఁ
దేజరిలుచుండు మాంధ్రప్రదేశమాత!
తఱుగు, విఱుగును లే నట్టి దొరతనమున. 31

ఆ॥వె॥ మఱపు, చెఱపులేని మహానీయగతి నసుం
ధరకు నభ్యుదయముఁ దనరఁ జేయు

రచయితల మనస్సు రంజింపు మాంధ్రప్ర
దేశమాత! నీకిదే జోహారు. 32

సీ॥ రాయలసీమ, సర్కార్లు, తెలంగాణ
పావనైక్యస్వరూపమ్ము గాఁగ,
నాలుగుకోట్ల ప్రజాలోకమే నిత్య
నవ్యత నలరు ప్రాణమ్ము గాఁగ,
దేశభాషలలో నుతిన్ గాంచిన తెలుంగు
పటుజీవరక్తస్రవంతి గాఁగ
సమదృష్టితోఁ బ్రభుత్వము నిర్వహించుటే
స్వాభావికంబైన శక్తి గాఁగ,

గీ॥ ఖ్యాతభారతోర్విని బరంజ్యోతి గాఁగ,
సంతతముఁ ద్రిపురాశ్రీవశంకరిగను
దేజరిల్లెడు నాంధ్రప్రదేశమాత।
యభయ మిడి మమ్ముఁ గాపాడు మహరహమ్ము. 33

క॥ ఆంధ్రప్రదేశమునకును,
నాంధ్రప్రజ, కాంధ్రభాష, కాంధ్రరమకు, మా
యాంధ్రప్రభుత్వమునకును,
నాంధ్రప్రతిభారతులకు ననయము జై జై! 34

కం॥ స్వాతంత్ర్య మాంధ్రవిజయ
ప్రాప్తిపుగ నొందుచుఁ బ్రచురించె నిపు డహా!
ప్రాప్తిర్థశిష్యుఁ డగు కవి
సీతారామాంజనేయ చేతః ప్రీతిన్. 35

